ఓం

శ్రీ సద్గురవే నమః

శ్రీ

# భక్తకల్పద్రుమశతకము

గన్నవరంతాలూకా—

మంతెనపురనివాసి

ఘానికొండ వేంకటేశ్వరరావుచే

రచియింపఁబడి

బ్రహ్మశ్రీ ఉప్పలూరు వెంకటసుబ్బారాయుడుగారి

ద్రవ్యసహాయముచే

ప్రచురింపఁబడెను

బెజవాడ

192[illegible]

[illegible]



అయ్యలారా!

ముముక్షువుల కతిసులభముగా తత్వానుభవము కలుగగలందులకు నాయోపినంత శక్తిచే దీనిని వ్రాసితిని. ఇదియే ప్రారంభమగుటచేతను విద్యావంతుడను గాకపోవుటచేతను కలిగిన లోపంబులు మన్నింతురుగాక.

సీ। ఎవ్వాడు గణకాప్రవృత్తి నేర్పున
ప్రభుసన్మాన మందె నిస్తంద్రముగను
ఎవ్వాడు దీనార్థివృత్తంబులకు నిరవయి
నించె కీర్తిని దిగంతపాళి
ఎవ్వాడు బూని సుహృద్బంధుజనముల
గల ప్రేమ బెనగొన గౌరవించె
ఎవ్వాడు తనరూప మెలమి సద్గురు
దర్పణంబున గాంచె వినమ్రుడగుచు
గీ॥ నట్టి శ్రీపుష్పులూరు వరాన్వయుండు
ఘనుడు శ్రీరామసూను డకల్మషుండు
సుబ్బరాయాభిధుం డర్థసూచకమున
ప్రచురపరపించె దీని శాశ్వతముగాగ॥

11-11-1921 ఇట్లు,

మంతెన, మానికొండ వెంకటేశ్వరరావు.

తెన్నేరు పోష్టు.

## —। గురుస్తుతి. ।—

ఉ॥ ఏతన్మాత్రుఁడుగాని వాని గుణసంపద్ధర్ముఁ బ్రబుద్ధాత్మకుం
వీతాఘుఁ వరశిష్యసంశయ ఘనాపచ్ఛేద జంఘాలనిల్కుఁ
భూతావాసుఁ జిన్మయుఁ సుజనసంపూజాంఘ్రియుగ్మున్ [మహా
ద్వైతార్థానుభవజ్ఞ మద్గురుని సుబ్రాయాహ్వయుఁ గొ [ల్చెదన్॥



ఓం

శ్రీగురవేనమః



శ్రీ

# శ్రీ భక్తకల్పద్రుమశతకము.

శా॥ శ్రీకారార్ధ మెఱుంగలేక భువి కీర్తిన్గాంట సంతానమున్|
జేకొంటన్ ధనధాన్యవస్తువితతిన్ జెన్నొంద భావింతురే|
సాకారేచ్ఛలు జన్మహేతువులు వాచ్యంబౌను నాకేల నా|
శ్రీకాంత్వ పదంబొసంగగదె శౌరీ భక్తకల్పద్రుమా॥

శా॥ శ్రీకాంతుండు శివుండు బ్రహ్మయును జేజేలున్ మునుల్ పన్నగుల్|
రాకాసుల్ మనుజుల్ పశుప్రతతియున్ రాల్చెట్లునున్ మట్టియున్|
లోకంబుల్ పలువాల్గు నీవయగుటన్ గుర్తించలేరయ్య యీ|
లోకుల్ జ్ఞానవికేద్ధరిన్ మునుగ మేలో భక్తకల్పద్రుమా॥ ౨

శా॥ పీకన్ నీకెదురెవ్వరెంచగను పృధ్వీభాగముంగా మహా|
శ్లోకుల్గాగ దురాత్మవంతులనుగా శోకాతురుల్గా సుఖా|
త్మైకప్రాప్తులుగా విరోధహితసౌహృద్వ్యక్తిగా వేదగా|
జేకూర్పంగల శుద్ధసత్వమునకున్ జే భక్తకల్పద్రుమా॥ ౩

మ॥ ధనికుంగా మరి కుంటిగా బధిరుగా ధర్మాత్ముగా లోభిగా|
మునిగా బేలగ లంజగా యువతిగా పుంస్త్రీనపుంసంబుగా|
పెనుగుట్టలను జంతుసంతతిగా బీజంబుగా చెట్టుగా|
మనజేయంగల నీమశక్తికి తరంబా భక్తకల్పద్రుమా॥ ౪

మ॥ గణుతింపంగలనయ్య యిట్టిదగు నీకార్యంబు లెంతేసియో।
గనలేనయ్య భవత్ప్రధానప్రకృతిన్ గాపట్యమో నిక్కమో।
యనజాలన్ వశమయ్య సృష్టివిధి బ్రహ్మజ్ఞానికిన్ గాకికన్।
బ్రణుతింతున్ వినుమయ్య ఘోరభవతాపా భక్తకల్పద్రుమా॥ ౫

శా॥ నీకన్నన్ పతిలేదు వేరె గతియు న్లేదంచునంచెంచి యె।
న్నో కల్పంబులనుండి చిత్తహితమై యోజించి నిష్కామ్య క।
ర్మాకర్షించు ఫలంబునట్టి కడు నిన్ యాచించినన్ గావవో।
యీకన్నోర్వవు నె దాత వేడుకొన నెంతే భక్తకల్పద్రుమా॥ ౬

మ॥ అనఘా సర్వము నీవెయంచు సుజనవ్యాకీర్ణవాక్యంబు లె।
ల్లను ఘోషింపగ వింటగాని యది కల్లా నిక్కమా యంచు లో।
ననుమానింతురు కొంద రజ్ఞులవురా! యాసందియం బేల నెం।
దును నీవుండక యేమిదోచు బుధబంధో భక్తకల్పద్రుమా॥ ౭

మ॥ అలరుందూపులవాని కోడితిక నాప్రాణంబుల న్నిల్పుమా।
లలనా! యుత్పలగంధి! కుందరదనా! లావణ్యసీమా! యటం।
చిల వేగ్రొందురుగాని భావ్యమని తండ్రీ నీదరిం జేగరే।
గలకంబుల్ సవరించివన్ ప్రకృతిబోనా? భక్తకల్పద్రుమా॥ ౮

మ॥ పలుకంజాలను మూరదృష్టి మరుసంబంధాగ్నిచే గ్రాగి దు।
ర్బలతన్ వేసట నిల్చినట్టి చెలులన్ ప్రార్థించ నేపాటి మే।
లలరున్ వారి వివేకమేమి దలపోయ న్చిత్రమైదోచు పే।
దల వేడంగ ధనంబు గూర్తువె నియంతా, భక్తకల్పద్రుమా॥ ౯

మ॥ నలినాక్షుల్ హిమవారిపూరమున స్నానంబాడి సౌగంధికో।
త్పలకుందాది విరుల్ సిగందురిమి డెందంబుబ్బగా గబ్బిగు।
బ్బలతావుల్ పచరింప నిల్చినను శాభావందు రేగాని యా।
కెలిమేపుంటిగనన్ యసహ్యమగు నస్సీ భక్తకల్పద్రుమా॥ ౧౦

మ॥ కలనాదంబు గభీరమద్భుతతరఘుంకారంబు మాధుర్యరా।
వలవంబంచు బహుప్రకారముల దుర్వాంఛితిన్ దగఁ బాక్కలో।
కలు బంధంబున నీదులాడుదురు దిక్కాంగాన కోంకారత।
ద్బలవంబద్ధియటన్న వాక్యమనలేవా భక్తకల్పద్రుమా॥ ౧౧

మ॥ పలుచందాల విపప్రమాణ విషయవ్యాప్తిఁ విసర్జించకే।
వ్వల సైరఁ పరమార్థచింత తగునా పాషండలాగాని కే।
వలజిజ్ఞాసువు లీవిరాగమును జేపట్టిందగున్ కాముకుల్।
కొలమఁ బందుగులఁ త్యజింపగనమేకోల్క భక్తకల్పద్రుమా॥ ౧౨

మ॥ ఘనవైరాగ్యము బూనినంతనె మహాఘవ్రాతముల్ దూరమా।
వినయంబబ్బును భూరిభూతదయ జొప్పిల్లుఁ తత్తస్వత్వసా।
ధనలంబ జేకురుషట్టివారికిల సద్ధానవ్రతాచారనై।
పుణులఁ నైర్ధికతత్వరుల్ సముల తెంభో భక్తకల్పద్రుమా॥ ౧౩

మ॥ అధికారంబును జెంది లోకమున నద్వైతార్థవిద్యా విశా।
రదమూర్తిఁ గనుగాని వాని కులగోత్రంబుఁ విచారించునే।
వ్యధతోడై వసుదేవు డాఖరపదద్వంద్వంబునఁ బట్టడే।
సదయాత్మా కొరగానివారికిది తెస్సా భక్తకల్పద్రుమా॥ ౧౪

మ॥ అలఘుప్రీతి భవత్పదాంబుజము లత్యంతంబు నర్చించి ని
ర్మల చిన్మాత్ర పరత్వసాధనముచే రంజిల్లునిత్యక్రియా।
విలస ద్భక్తుని భాగ్యభోగ్యములు భావింపంగనెంతేని వా।
రలకుం గూడునె రక్షితార్తజనవర్గా భక్తకల్పద్రుమా॥ ౧౫

శా॥ నీసాన్నిధ్యనివాసమున విమలమై నిత్యంబునై యొప్పనీ।
దాసద్భోధయె వింటయుఁ విడకనీయజ్ఞానుసారంబునఁ।
దాసత్వంబుననంటయుఁ విహితకాంతత్వంబుచేకూర వి।
శ్వాసంబుంచు వ హాప్రభో!విగత పాశా భక్తకల్పద్రుమా॥ ౧౬

మ॥ నీసంబోధన దుఃఖవార్ధితరణంబేయౌను సిద్ధాంతమే।
గాసుండద్ది మనంబుబట్టకను ఖేదభ్రాంతిచేజిక్కి పే।
రాసఁ మీయనదెట్లు నంధునకు భావ్యంబంచు నద్దంబునుఁ।
జేసంధిల్లగ జేసినట్టులుగదో చెఁ భక్తకల్పద్రుమా॥ ౧౭

మ॥ అనఘా భక్తుల పాదధూళి మమతాహంకార వెన్నూభత పం।
క్తిని బోనోల విభూతి, భక్తపద పానీయంబు తాపత్రయా।
గ్నిని చల్లార్చు సుధార్ణవంబు కడురక్తింజేయ భక్తాళి ద।
ర్శనమే పావన మిట్టులుండగను మీశా భక్తకల్పద్రుమా॥ ౧౮

మ॥ మందప్రాజ్ఞుడనైన నన్నెటుల ప్రేమంజూచిబోధింతువో।
డెందంబా మలినంబు ధర్మమన గోడే లేదు సంతానమా।
సందే లేదు దరిద్రమా వెలితిదోచంబోవ దన్యంబు గో।
రం దేహీ యని వేడినాడ విడమేరా భక్తకల్పద్రుమా॥ ౧౯

మ॥ అలకాపట్టణమా మహేంద్రు భవనంబా సత్యలోకంబొకో।
యల వైకుంఠమొ శంకరాలయమొ మార్తాండప్రపంచంబొ కే।
వలపాతాళమొ మర్త్యదేశమొ హరిద్వారంబొ కాశీ గయో।
దలపం దేహమొ తెల్పు నీవస తనంతా భక్తకల్పద్రుమా॥ ౨౦

మ॥ శిలవో చెట్టువొ పుట్టవో ప్రతిమవో జేగంటవో వత్తివో।
కొలువుంచంబవొ చంటివో ముదితవో కుఱ్ఱండవో పెద్దవో।
దలపఁలేము భవత్స్వరూప మనుసంధానంబు సేయంగదే।
జలజాక్షా తగదయ్య నీవు నను నేచఁ భక్తకల్పద్రుమా॥ ౨౧

మ॥ వినువర్ణింపగ నెంతవాడను మహానిష్ఠా గరిష్ఠుల్ బుధుల్।
మునులున్ బ్రహ్మలు జెప్పలేరయిరి సంబోధించగా గోళ్ళమో।
మనమో బుద్ధియొకో యవస్థయొ తమంబో జ్ఞానమో యాపయిఁ।
గనమో యని సంశయింత్రు భ్రమచేఁ భక్తకల్పద్రుమా॥ ౨౨

మ॥ మునునీసంగతిచేత సంయములు పెంపుంగాంచి నీయంద చి।
క్కిన భక్తిన్ నినుగొల్చి యాతుకముక్తిన్ జెందరే కొందరో।
యనఘా యిట్టిచరిత్రలెల్ల విన సౌఖ్యంబొందరే దుఃఖము।
జ్జ్వలతన్ గ్రాఁగెడివారు దుష్టజనశిక్షా, భక్తకల్పద్రుమా॥ ౨౩

మ॥ అలయం దారసుతార్థ గోప్రతతి గేహాంబాదిగా గల్గు ని।
ష్ఫల సంసారపయోధి నీఁదఁబడి లేశంబైన కృష్ణా, దయా।
జలధే, మాధవ, శంకరా, యభవ, నిస్సంగా, యటంచాడ దే।
ట్టులనన్ నీటనిబట్టి తెప్పవిడునట్టుల్ భక్తకల్పద్రుమా॥ ౨౪

మ॥ పలుకం జాలగలేము యింటనొక యాపత్సంభవంబాయెనా।
పలుమ్రొక్కుల్ పచరింత్రు నాఁడు వెటబోవ నీదు తేజంబె క।
న్నులకుం గట్టినటుండు నాపగిది చెన్నన్నీగ నిత్యంబు నిన్।
దలతు న్ననన్న దయార్ద్రదృష్టి గనుమన్నా భక్తకల్పద్రుమా॥ ౨౫

మ॥ రమణీయంబగు నీదు సృష్టిగన జిత్రంబయ్యెడిన్ పంచభూ।
తములే గన్పడు నెందు జూడఁగ పదార్థంబా యటంచారయన్।
గ్రగను మొవ్వాగ లయంబు చేసినను నాకాశంబె దానిల్వదో।
భ్రమయేగాని పదార్థశూన్యమగు దేవా భక్తకల్పద్రుమా॥ ౨౬

శా॥ రంగుల్ బంగరు కంకణంబువరుదారన్ చగ్గ్రసేయుంగ నె
బ్బంగిన్ బంగరు వేరుసేసినను రూపం బాభిదానంబు లెం
దుం గానంబడరావు కాంచనమునందుం గల్పితంబైన య
ట్లుంగా దోచు జగంబు నీయెడ దయాళూ భక్తకల్పద్రుమా॥ ౨౭

మ॥ పరమార్థంబుగడించనీదు కడు దుష్పాండిత్యముంబెంచు ను
స్థిరమౌ దానిని కల్లజేయు బహుఫాటీశోరుతాబొందు మే
లరయ న్వీసములేదు మానసమునైక్యంబెట్టవన్ వస్త్రముల్
గొరఃకుంచిమ్మట దానికెట్టిఫల మొక్కో భక్తకల్పద్రుమా॥ ౨౮

శా॥ పట్టంగావలె నీదుపాదములు సద్భక్తిన్ ప్రమోదంబుగా
కొట్టంగావలె ఘోరపాప సమితి న్నీయండఁజేముంచి చే।

పట్టంగావలె బ్రహ్మవిద్య నిగమోపన్యాసమా బోధచే।
దిట్టా నీదయగల్గ నింక కొరతెద్దీ? భక్తకల్పద్రుమా॥ ౨౯

మ॥ వెస నాచార్యుని జేరి దాస్యమలరన్ ప్రేమ న్విచారించి వి।
శ్వసనీయంబగు బోధచెప్పి వటులొప్ప న్బుద్ధి కెక్కించుటా।
దిసదాచారముల న్మెలంగుటలు సాధించంగ చెర్లాటలా।
యసిధారావ్రతమటు కష్టనుగదయ్యా భక్తకల్పద్రుమా॥ 3౦

మ॥ పరతత్వానుభవంబు దాడ సులభప్రాప్యంబుగాకేమి దు।
స్తరమా కేవలశుద్ధసత్వ గుణవిభ్రాంతవ్య భక్తిప్రభా।
భరితస్వాంతులకున్ మృణాళవిసర వ్యాకీర్ణమా మదవ్వనన్।
జోర ఖడ్గంబుగలట్టివారి కడలున్నొ? భక్తకల్పద్రుమా॥ 3౧

మ॥ నిను నోర్నొవ్వ హరీ పురాంతక శివా గిష్ఠాను నిశ్శ్వయం।
చు నయాత్ముండయి పల్కుడే జనునిర క్షోణీశుడైనట కడ।
ననిరుంధైనను శాస్త్రకోవిదుడైయైనన్ గొప్పలంచంబు చే।
ర్పినవానిం దరిజేరనిచ్చెదవె తండ్రీ భక్తకల్పద్రుమా॥ 3౨

మ॥ శ్రవణాదీంద్రియ జ్ఞానపంచకమునున్ ఘ్రాణేంద్రియంబాదిగా।
నవలీలన్ వరుసక్రమాన భవదుద్యత్పాదముల్ సోక ప్రమొ।
క్క నెసన్ వందనమయ్యెగాన నటుదీక్షంబూని యేప్రొక్కుచుం।
టి వరంబీవె భవాబ్ధిదాట దొరకంటిన్ భక్తకల్పద్రుమా॥ 33

మ॥ అకలంకంబుగ భూతపంచకము శ్రోత్రాదీంద్రియంబు ల్సపం।
చికృతంబౌతనుమాత్రలు న్తనువు చర్చింపంగ నేకంబెయా।
ట గదా నిత్యము నీదుపాదయుగమంటన్ భక్తిచే ప్రొక్కగా।
సకలం బర్పణసేయుటయ్యె జగదీశా భక్తకల్పద్రుమా॥ 3౪

మ॥ గురుపాంతన్ వసియింపగల్గె నిక నాకున్ లోటు గద్దా యటం।
చు రజోవ్యాప్తి చిదాత్మరైన తనయందున్ లేక కర్తృత్వమా।
దరణీయంబుగజేసి పెద్దలకు సంతాపంబుగల్గింమ వా।
దరయన్ గంధపుచెటుచెంత భుజగంబా భక్తకల్పద్రుమా॥ 3౫

శా॥ నీవాసస్థలమౌను కాశి విలసన్నీపాద నీరేజధారా
వారాశియె గంగయౌను మధుర ప్రాచీన వాక్యంబులౌ
గా వేదాంతరహస్యమంత్రములు నీకారుణ్యమే మోక్షమౌ
దేవా నన్ను భరింపుమయ్య శరణార్థిన్ భక్తకల్పద్రుమా॥ 3౬

శా॥ నీవే నేనని బోధజేసి ప్రకృతిన్ ఛేదింపగాఁగల్గు వేల్
త్రోవన్జూపి యనాథనైన నను నిర్ద్వంద్వంబటంచేచకన్
నీవాత్సల్యత జూపి లోకమున నెంతే పద్దువాటించితౌ
నీవాడన్ పొరబాటులేదు శరణంటిన్ భక్తకల్పద్రుమా॥ 3౭

మ॥ చిరకాలంబు భరించి బోధవిన నాచేగాదు దాస్యంబు నే
నెరపనాలను దుర్బలత్వమవుట నీ వెంటనుండంగరా
దరయ న్పిల్లలు మేకలుం గలుగ మిమ్మాయింట మంచంగలే
మిరువాలించెను పీడనంచు దగమీనే భక్తకల్పద్రుమా॥ 3౮

మ॥ అకలంకత్వమున స్మజించి తనువు ప్రాణంబు చిత్తంబు స
ద్వకళాశోభిత! నీసమర్పణముగా భావించి నీపాదసే
వకుడై యెవ్వడివాడు ధన్యతముడౌ వాడీ జగత్పూజ్యుడౌ
టకు సందేహములేదు నీదుకృపకంటె స్భక్తకల్పద్రుమా॥ 3౯

శా॥ నీపాదంబులు బట్టినాడ పెరవానింగా వసంజూడక
య్యా! పాఖండసఖంచు నోటవడి బిట్టార్వంగ నేమాయె నో
హో! పుణ్యాత్మక! నీదుపాదమహిమం బొప్పార భావింపగా
నోపంజాలరు కుష్కచిత్తులు కృపజూ భక్తకల్పద్రుమా॥ ౪౦

మ॥ క్రతువుల్ యాగములు న్మహాధ్వరములు న్గాంక్షించి ద్రవ్యంబు న
ద్ధత వెచ్చింతురు ప్రోద్భవోక్త ఫలుచందాల న్విచారింప నా
క్రతుసంతానము జన్మహేతువగు గాక న్మోక్షదంబౌనొకో
మతి కౌటిల్యత పీడబోరగద రామా భక్తకల్పద్రుమా॥ ౪౧

మ॥ ధర నిష్కామ్యత నీశ్వరార్పణముగా దారిన్ని యాగాదులన్
వరుసన్జేసిన వారి పూర్వసుకృత ప్రస్తావమున్సేయగా

దరమెవ్వారికిగాదు వారలిక ముక్తప్రాంగణాదష్టులై।
యిరవందన్నినుజేరఁజాలుదురు తండ్రీ భక్తకల్పద్రుమా। ౪౨

శా॥ నేనీపాదసరోజసేవకుడ నేనిఁ కర్మ మడ్డంబుగా।
గానీ ఘోరకరాళజిహ్వకలతో కాలాహియై కష్టముల్।
రానీ భక్తులు వీఁడు దుష్టుడని చుల్కన్నేయనీ యింక నే।
మైనంగాని నినుఁ భజింతు గురురాయా భక్తకల్పద్రుమా॥ ౪౩

శా॥ ఆయాలోకములంచు దుర్గ్రహుల నూహాశ్రేసి జన్మార్ధులై।
కాయంబు న్గడుగష్టపెట్టి గతసౌఖ్యప్రాప్తులై చేల్లరై।
యాయాచోట్లనవ్రాలు కాకిగతి భావ్యంబంచు వర్తింతు రా।
హా! యెన్నాళ్ళకు వారి ముక్తత పరేశా భక్తకల్పద్రుమా॥ ౪౪

శా॥ ప్రాణంబు ల్ధరియించి సర్వవిషయవ్యాకీర్ణుడా నిత్యక।
ర్మానుష్ఠాతయె జీవుడౌను నిజమాయాబింబితంబై సమ।
ష్ట్యాత్మానాభిమతంబుగల్గి నిఖిలవ్యాపార ప్రేరేపకుం
డై నిస్సంగతనుండు నీశ్వరుడు దేవా భక్తకల్పద్రుమా॥ ౪౫

మ॥ ఆకాశం బనిలంబు వహ్ని జల పృథ్వ్యాదిప్రకాండంబెయా।
లోకంబన్నను జీవుడీశ్వరుడు యీలోకంబులం లోకులున్।
లోకాధీశులు గాఁగటంచు మది మిమ్మున్ సచ్చిదానందబో।
ధాకల్పాంత విలాసిగా దలతు నీశా భక్తకల్పద్రుమా॥ ౪౬

శా॥ విద్యున్నాటకశాలయందు విహితప్రేమానుబంధంబుతో।
నుద్యల్లీల మెలంగు పాత్రల వికారోల్లాసముల్ లేకయుం
సద్యస్కాలమునందు సర్వమును భాస్వంతంబుగాఁజేయు నా।
విద్యుద్దీపముబోలి వెల్గు వెలు గీవే భక్తకల్పద్రుమా॥ ౪౭

మ॥ శ్రవణాదిత్రయ కార్యసంచయము విశ్వాసంబుతో సేయగా।
పవలు న్రాత్రులు వంతు నాది మహితప్రాచీన వాగ్జృంభణా।
రవధారామృతవర్షముం గురియ తోరంబొప్ప బోధించ నీ।
దై వరిల్లును ముమ్ము వంతు మహితాత్మా భక్తకల్పద్రుమా॥ ౪౮

శా॥ నేఁబూజించితి సేవఁజేసితి మహానీయంబుతోఁ జెప్పినం
ట్లేహాల్పొందితి బోధవింటి విరళుండై తహహా! సద్గురుం
డేపూజ్యుండు మహానుభావుఁడనుచున్ జేఁగొంటి నాస్వప్నమే
యాపెక్కేల హుళక్కి నీదెస మహాత్మా భక్తకల్పద్రుమా॥ ౪౯

మ॥ త్రివిధాద్వైతము సన్నిధానమున వర్తింపంగ నద్వైతసి
ద్ధి వెసన్ గల్గుచుగాక సేవనహా యర్ధింగొల్చుటే కల్ల బో
ధవినన్ శూన్యగుటంచు బల్కఁగను నాద్వైతం గురో స్సన్నిధే
తి వచస్సంబియు మెల్ల మిధ్యయగుగాదే భక్తకల్పద్రుమా॥ ౫౦

మ॥ పరికింపన్ మఱినీసమానుఁడెటు లోపంజాట వస్యం బటం
చు రహిన్ జెప్ప జగంబు శూన్యమవుటం బొల్పొంద నీయందులన్
గరపాదాదుల పంక్తి లేనిదవుటన్ శాసింతు యుష్మత్స్వరూ
పరహస్యంబు త్రిజాతిశూన్యమని దేవా భక్తకల్పద్రుమా॥ ౫౧

మ॥ అస్పృశ్యంబై జడదుఃఖరూపమయకాయంబా ననాత్మ క్షుగం
బనసచ్చిత్సుఖ మాత్మ యాత్మగను నీవాగా మహాత్మా దయా
వనధీ! నాకడ గోప్యముంచకిక నీభక్తాళిలో నొక్కఁడుం
డనుగా నెంచుము నమ్మియుంటి కడువేడ్కన్ భక్తకల్పద్రుమా॥ ౫౨

శా॥ సంతాపంబులు వీడఁగంటి పృథుసంసారాబ్ధినిం దాటితిన్
గంతవ్యంబులపైన గోర్కు లణఁగంటం జూచితిన్ నిర్మల
స్వాంతంబై పొడఁగంటి నిన్ను నిక నాభాగ్యంబువంజేసి నీ
చెంతం జేరెడివారు ధన్యులుగదా శ్రీభక్తకల్పద్రుమా॥ ౫౩

మ॥ సిరులం గోరుటగాదు పుత్రులను వాంఛింపంగ లేదయ్య న
వ్యరమాభాసిత దివ్యమందిరముల న్యాచించుటా గాదు బం
ధురభూచక్రపతిత్వ మిమ్మని నినున్ బూజించుటా గాదు సు
స్థిరతన్నీడని భక్తి నాకొసఁగు ప్రీతిన్ భక్తకల్పద్రుమా॥ ౫౪

శా॥ నీరాజత్పదనీరజాతయుగళి న్సేవించి మోదించనీ
నీరేజాతభవాది దేవతలుగానీ పెద్దకాలంబు నా

హేరంబుఁ ద్యజియించు యోగులును దివ్యజ్ఞానులైనం భువిన్।
బ్రారబ్ధంబు భుజింపకుంట దరమా నా? భక్తకల్పద్రుమా॥ ౪౪

మ. అతికాఠిన్యము నీమనంబగు నసాధ్యంబౌను నీసేవ దు।
స్తతిభంజింప నిశ్శైన సన్నడగు శ్రీనీకటాక్షంబునా।
తత నాపైబరించు భాగ్యమును నత్యంత ప్రభావైక ని।
త్య తపోనిష్ఠ నినుజ్ఞ భజించుటలు రామా భక్తకల్పద్రుమా॥ ౪౫

శా. నీదాస్యంబును సేయనీ విమలమౌ నిర్బోధయేవించు నీ।
మీదన్ స్వాంతమునిల్పనీ విడువక నీదాసులంగూడ నీ।
వాదుల్దప్పవు లోకతంత్రమున నాస్వన్ జెప్ప నేర్పుట్టనై।
నేనైనం గరుణంగ సర్వసుని తంత్రీ భక్తకల్పద్రుమా॥ ౪౬

మ॥ కటిలాత్మ ల్గవలేరుగాని భవదంఘ్రుల్ బట్టి నిత్యంబు సెం।
టట సేవించెడి వారికైన గలదన్నన్ వాగలో మేరలే।
దిటులంచుం బలుకంగ జూప గన మాకే గాదు గాయంచు ని।
ష్కట విస్తార మదోష్టబోధ మహిమంబో భక్తకల్పద్రుమా॥ ౪౭

మ॥ కలవారి పనిజేయు సాంపదగు గాకన్ జెట్టినే స్తుకు సే।
న్వలసంజికొరయు గోపికలు గడ మేనన్ బుల్కలెత్తి గాదగా।
కలితస్వాంతుడ వైతి కాని కదు వేడ్కం బెద్దకాలంబునిన్।
గొలువన్ వాదెన జూడవైతి బుధబంధో భక్తకల్పద్రుమా॥ ౪౮

మ॥ దివిజాళిక శిరఃప్రశస్త మకుటద్యద్రత్న ప్రకాం।
దవిరాజద్భవ దంఘ్రిపల్లవములన్ భావించి సేవింపనా।
కకలీలాయెను భాగ్యపుణ్యఫల మాహా వర్ణనాతీతమై।
దఫలంగాదె మహాత్మ మౌనిజననేతా భక్తకల్పద్రుమా॥ ౫౦

శా॥ నీ సేవన్నను భరింపలేనని మదిన్ జింతిల్లుటల్ జూడగా।
దేవా నీపరివార వర్ధపడిరో దేవేరులేమంచు దా।
భావంబిచ్చిరొ వీడు దుష్టుడనుచుం బాటించితో గాక నిం।
డా విశ్వాసము కద్దె నాపయి ఘనంతా భక్తకల్పద్రుమా॥ ౫౧

హేరంబుఁ ద్యజియించు గోరోకలును దివ్యజ్ఞానులైనం భువిన్।
ప్రారబ్ధంబు భుజింపకుంట దరమా నా? భక్తకల్పద్రుమా॥ ౫౫

మ॥ అతికాఠిన్యము నీమనంబగు నసాధ్యంబౌను నీసేవ దు।
స్తతిభంజింప నికైన సెన్నడగు నీకా నీకటాక్షంబు నా।
తత నాపైబచరించు భాగ్యమును నత్యంత ప్రభావైక ని।
త్య తపోనిష్ఠ నినుఁ భజించుటలు రామా భక్తకల్పద్రుమా॥ ౫౬

శా॥ నీదాస్యంబును సేయనీ విమలవా నీబోధయేవించు నీ।
మీదన్ స్వాంతమునిల్పనీ విడువక నీదాసులంగూడ నీ।
వాదుల్దప్పవు లోకతంత్రమున నొప్పన్ జెప్పరేఘట్టపై।
నేదైనం గరుణంగ సర్వమని తండ్రీ భక్తకల్పద్రుమా॥ ౫౭

మ॥ కటిలాత్మ ల్గవలేరుగాని భవదంఘ్రుల్ బట్టి నిత్యంబు చెం।
గట సేవించెడి వారికైన గలదన్నన్ వాగలో మేరలే।
దిటులంచుం బలుకంగ జూప గన మాకే గాదు గాయంచు జె।
ప్పాట విన్నార మదెట్టిబోధ మహాము ?బో భక్తకల్పద్రుమా॥ ౫౮

మ॥ కలవారే పనిజేయు పాడియగు గాకన్ జెల్లనే స్వకు పై।
న్వలపుంజిక్కియు గోపికల్ గడ మేనన్ బుల్కరిత్తన్ దగా।
కలితస్వాంకుడ వైతికాని కదు వేడ్కం బెద్ద కాలంబునిన్।
గొలువన్ వాదెస జూడవైతి బుధబంధో భక్తకల్పద్రుమా॥ ౫౯

మ॥ దివిజానీక శిరఃప్రశస్త మకుటద్వీప్తోరు రత్నప్రకాం।
డవిరాజద్భవ దంఘ్రిపల్లవములన్ భావించి సేవించనా।
కవలీలాయెను పూర్వపుణ్యఫల మాహా వర్ణనాతీతమై।
దవులంగాదె మహాత్మ మానిజననేతా భక్తకల్పద్రుమా। ౬౦

శా॥ నీవేనన్ను భరింపలేనని మదిన్ జింతిల్లుటల్ జూడగా।
దేవానీపరివార మడ్డుపడిరో దేవేరులేమంచు దా।
భావంబిచ్చిరో వీడుదుష్టుడనుచుం బాటించితో గాక నిం।
దా విశ్వాసము కద్దె నాపయి నకంకా భక్తకల్పద్రుమా॥ ౬౧

శా॥ చెప్పంజాలరు నీకు ధర్మములు నీచే విన్నవే గాక మా।
యప్పా! జీక్రాంతి దక్రాంతి న్విడువ సద్యాలించుమా యంచు నీ।
గొప్పన్గోరియు శాస్త్రమైబడినవో కోర్కుల్వె సందీర్చ విూ।
కొప్పంగ దీనశరణ్యా! యార్తజనబంధో! భక్తకల్పద్రుమా॥ ౬౨

శా॥ కొన్నాళంట బికంద విూవు మునిముఖ్యుల్ జెప్పగా వింటి నా।
పన్నశ్రేణి ధరింప కంకణము చేబంధించి రక్షించి ము।
న్నెన్నండో యది నిక్కమైనయెడ నింకేలాలసింపంగనన్।
మన్నింపందగు పాపభీతిబడకుండంగ భక్తకల్పద్రుమా। ౬౩

శా॥ వైరాగ్యోపగతప్రబోధములు సంభావింపగా నొక్కచో।
జేరంజాలుట దుర్లభంబనుచు వేజెప్పంగ విన్నాడ నీ।
ప్రారబ్ధాంతర ఖేదమున్నటుల ప్రాప్తాప్రాప్తముల్గల్గు నం।
దారూఢస్థితిబోధ మెక్కడను గదయ్యా భక్తకల్పద్రుమా॥ ౬౪

మ॥ ప్రతియూరన్ బ్రతిసుప్రకాశమున నిన్ భావించి ప్రాచీను లు।
ద్ధత దేవాలయముల్ ప్రతిష్ఠలను వొందన్ జేసియు న్నేయున్నన।
ష్ఠితసంపూజితుల గావ మార్గములు గాకన్ వారలే మైన స్వా
ర్థిత నాశించిరి స్వభూతహితకారా భక్తకల్పద్రుమా॥ ౬౫

మ॥ అధికారంబుననుండునాడపుల విద్యాభ్యాసముం జేయు నా।
దు దిక్ప్రాఙ్జిత నాశ్రయంబునను దానొప్పారు నాడున్ మహా।
త్పదతత్వస్థితి జెందునాడును సహోభావించి లోకోపకా।
రదయాదృష్టిని నుండుటొప్పు భయదూరా భక్తకల్పద్రుమా॥ ౬౬

మ॥ త్రిదశారిప్రముఖాటవీదహన సందీప్తా మహాదేవ త్వం।
పదలక్ష్యార్థము నైన నేను వివశత్వప్రాప్తి బూజింతు త।
త్పదలక్ష్యార్థము వైన నిన్ను ప్రకట ప్రావీణ్యమా భక్తిచే।
హృదయగ్రంథివినాశ తాపసవిహారీ! భక్తకల్పద్రుమా॥ ౬౭

మ॥ విను తాపత్రితయంబు నష్టమదముల్ పెంపొంద గాన్పించు నీ।
మణము లూర్మాడను వాసనాత్రయము విశ్వప్రాకటంబైన దు।

గ్గుణపుంజంబును నాసయు న్వెలసి దిక్కుల్ పిక్కటిల్లంగ ముం।
చును దుఃఖంబున దేహమేననిన శంభో భక్తకల్పద్రుమా॥ ౧౮

మ॥ కన నజ్ఞానమునందు గల్గు నవివేకంబన్న జాడ్యంబు నం।
దున జన్మించభిమాన మందునను చెన్నన్నీరు రాగాదు లం।
దున కర్మంబును నందు జన్మమును నందు న్దుఃఖము న్బుట్టు మీ।
టిని సప్తావరణంబులంచు బోధగంటిన్ భక్తకల్పద్రుమా॥ ౧౯

శా॥ వేదాంతంబిల రానరాను తమసావిర్భూత శుష్కక్రియా।
బోధాకల్పితమై చెలంగె గతసంపూజంబుగా నిష్టమం।
దేదాకొల్పియు జిహ్వాగుహ్యచపలాదిభ్రాంతతృష్ణాత్మ దు।
ష్పాదసాప్యములం బుట్టె మానిజనజీవా భక్తకల్పద్రుమా॥ ౨౦

మ॥ నిను గాంక్షించెడివారిలోన ననుమానింపన్ స్వభావంబు గ।
ల్గినవాడన్ ప్రతిబంధముత్తమను యేలీలన్ ప్రబోధింతువో।
సనకాదిప్రముఖప్రసంగ భవపాశప్రజ్ఞభంగా కనన్।
ఘనశోభాంగ దయాంతరంగ గతసంగా భక్తకల్పద్రుమా॥ ౨౧

శా॥ నేసాటింతు భవత్పదాంబుజముల న్నిత్యంబు సేవించి నీ।
దాసశ్రేష్ఠుల దాసుడై చెలగు సద్భక్తుండు దుర్వారమి।
థ్యాసంసారపయోధి దేలియును సత్యస్ఫూర్తి నీవౌనటం।
చోసాధూత్తమహృద్విలాస శివ శంభో భక్తకల్పద్రుమా॥ ౨౨

మ॥ ప్రణతారాతికదంబ మానిజనవ్యాప్తత్వంకేజ గోలంబ వి।
శ్వనివాసప్రతిబింబ రాజితశుభాస్యాచంద్రబింబా మహా।
ద్గుణసంరంభ దయావలంబ భవనిర్ధూతా విడంబా క్షమా।
పణగావింపుము నాదు నేరముల దేవా భక్తకల్పద్రుమా॥ ౨3

మ॥ పలుశాస్త్రాభ్యసనంబు జేసినను సంభావింప వేదోక్తక।
ర్మల నిత్యంబును జేయుచుండినను తీర్థశ్రేణి సేవించినన్।
గలదే నీదగు సుస్వరూపమును గాంచంగల్గు భాగ్యంబు ని।
ర్మలసద్భక్తిని గూర్చకున్నను మహాత్మా భక్తకల్పద్రుమా॥ ౨౪

మ॥ కనినన్ దృశ్యమయాత్మకంబయిన జాగ్రత్స్వప్నరూప ప్రపం।
చ నికాయంబు మనంబెయౌ నదియెటన్నన్ మానసంబందు బు।
ట్టు నశింగున్ మనమున్న యప్డు జగముండున్ గాని తన్నాశమం।
దున లోకంబన లేదుగాదె బుధబంధో భక్తకల్పద్రుమా॥ ౨౫

మ॥ పరతత్త్వంబన నీవ సుస్థిరతనిన్ బ్రార్థించుచే బ్రోవ దు।
స్తర దుఃఖాంబుధి దాటనౌర పృథుసత్త్వాగల్గు నీసేవ ము।
క్తి రమాసంగతభావ మౌనిజన హృద్వ్యక్తిప్రభావా వసుం।
ధరభారోత్తర బ్రోవుమంటిని ముకుందా భక్తకల్పద్రుమా॥ ౨౬

మ॥ తనుపుంగూటికి కూలికానవడి వేడ్కన్ మోయుభారంబు నె।
క్కుడునైనన్ బరువంచు దుఃఖపడునో కొక్కొ యొక్కొ డక్లేజుమీ॥
జడతన్ దూలెడివాడు శోకహత దుస్సంసార మాహ్లోదతన్।
గడుపుంగాదె సతీసుతప్రభృతివాంఛన్ భక్తకల్పద్రుమా॥ ౨౭

మ॥ వివరింపంగను జ్ఞానికజ్ఞునకు నేభేదంబు గాన్పించు లో।
కవిధిప్రాప్తున జూడ నన్యులకు హృద్గ్రంథ్యంతరాయంబుచే।
త విరాజిల్లును నిత్యముక్తతను సత్యజ్ఞాని యజ్ఞుండు దా।
నవివేకంబున దుఃఖమొందు గద రామా భక్తకల్పద్రుమా॥ ౨౮

శా॥ భోగంబంతయు నీదె నిక్కమని సంభావించు విజ్ఞానులె।
వ్వారుం బొందరె దిట్టికర్మ మొనరింప న్తత్ఫలం బన్యులె।
వ్వారీ గ్రంథి సడల్పలేక యటుసల్పన్ జేటువాటిల్లు నెం।
పారన్ శూద్రుడు విప్రచర్య గనినట్లో భక్తకల్పద్రుమా॥ ౨౯

మ॥ నిరతంబున్ భవదీయపాద విలసన్నీరేజ పత్త్రంబులం।
గురిగా జేర్చు మనంబుతోడను భవద్గోష్ఠీవినోదక్రియా।
పరతంత్రంబయి జీవితంబు నెరవేర్పంగల్గు భక్తాఘమున్।
వరిజేరంగలదే జమున్ దమృతదాతా భక్తకల్పద్రుమా॥ ౩౦

శా॥ జనవిద్వేషి యజామిళుండు విషయాసక్తిఁ బ్రవర్తించియుఁ
వనటఁ గుందుచు నంత్యవేళను మనోవాక్కాయ కర్మంబుల
న్నిను దా బేర్కొని యంతమాత్రముననే నీసన్నిధిం జేర్చినా
వని విన్నాఁడ దయాబ్ధివీవగుట దేవా భక్తకల్పద్రుమా॥ ౭౧

మ॥ అపరాధంబున నుండ వానికి సహాయం బొప్పగాజేసి నీ
కృపజూపందగు ధర్మమౌనుగద యోగిధ్యేయ బోధాస్వరూ
పపరా నాయెడ నేరమెంచకు మహాపత్సంధి నున్నాఁడ ని
త్యపదారోహణ సాధనౌషధము నిమ్మా భక్తకల్పద్రుమా॥ ౭౨

శా॥ లోకంబుల్సతమంచు దుర్విషయలోలుండయ్యె కర్మిష్ఠిదా
వైకల్యంబుననుండు నాత్మవిదుఁడీవ్యక్త ప్రపంచంబుమా
యాకార్యంబుగనెం చిత్తృప్తిగను స్వర్గంబౌనె వీరిద్దరా
హా! కయ్యాటములాడగా జెవిటిగోడా భక్తకల్పద్రుమా॥ ౭౩

మ॥ పలుకష్టంబులకోర్చి పావకుని చేపట్టంగ నౌరాల్మి బె
బ్బులికోరల్ జెనకంగవచ్చు జలధి న్బొల్పొందగా నీదవ
చ్చులలిం బ్రహ్మము నైతివంచు వనవచ్చుఁ గాని వేతన్ను దా
దెలియఁగ దుర్లభమయ్యె శోషితబుధార్తి భక్తకల్పద్రుమా॥ ౭౪

మ॥ మనమా జూడఁగలేదు వాక్యముల సన్మానింపగారాదు క్ర
స్సన కాయక్రియలందు పట్టువడ దానందైక బోధాస్వరూ
పనిరాకార నిరింద్రియుంబగు భవద్వ్యాప్తవ్య మింకెట్లుగాం
చనగుఁ బ్రీతి ముముక్షుసంతతి మహేశా భక్తకల్పద్రుమా॥ ౭౫

మ॥ తనువే తేరగు బుద్ధి సారథి జవత్వప్రౌఢిమాశ్వంబులే
ఘనత న్మించు దశేంద్రియంబులుగ సింగారించియు న్జీవుడే
యనువొందఁ రథికుండుగా నలరి గమ్యస్థానమాశించి సూ
తుని శుద్ధంబుగ జేసినేని సుఖమందుఁ భక్తకల్పద్రుమా॥ ౭౬

మ॥ అణిమాదుల్ ఘనయోగతంత్రములు కాయక్లేశమే గాని ని।
గ్గుణతత్వంబును జేగతేవు ప్రథితాఖండప్రబోధంబు జెం।
దిన నే గాకను కల్పితోరు భుజగాధిష్ఠానమౌ రజ్జువుక్।
గన రజ్జుజ్ఞత లేనిచో దెలియనౌనా? భక్తకల్పద్రుమా॥ ౫౭

మ॥ వగచే వైరముచే భయాకులతచే వాదంబుచే భక్తిచే।
త గురింపక నెట్టులైనను నినుర్ ధ్యానించువాడాయెనా।
తెగటార్చున్ భవబీజసంజనిత పృథ్వీజప్రకాండంబు స।
త్వగుణాలంకృతపూరుష ప్రమగభావా భక్తకల్పద్రుమా॥ ౫౮

మ॥ అతిలావణ్యశరీర సంతత ముముక్షాధార నిశ్శ్రేయసం।
హృతభూభార పదూర్మిదూర వినతాబృందార కావార ఖం।
డితదుర్మంత్రవిచార వేదఘనవాటీనిత్యసంచార స।
ద్గతి సాకీవి పరాత్పరా సుజనరక్షా భక్తకల్పద్రుమా॥

శా॥ ఏతన్మాత్రమె నిన్నెరుంగుట? సదా కృద్యోగసర్వేంద్రియ।
స్థితంబొందుటయో జటల్బెనిచి సంశీలుండనంచంటయో।
వీతభ్రాంతిని గంటయో ప్రబలి నీవే నేనుగా నుంటయో।
చేతోజాడ్యమనీవ వేద్యమగునా శ్రీభక్తకల్పద్రుమా॥ ౬౦

మ॥ పరిశీలింపుడు సూక్ష్మబుద్ధులు బుధప్రాశస్త్య మీబోధ మా।
తరణీయంబగు సాంప్రదాయము యవిద్యారూపమున్నష్ట నీ।
కరయున్ ధర్మనిరూపణం బొనర సేయుంజాలిరేగాక నే।
ర్పరుపంజాలుదురే యఖండపరిపూర్ణా భక్తకల్పద్రుమా॥ ౬౧

మ॥ మది గాంక్షించి యనేకదేవతల సన్మానించి యాయాఫలా।
ర్థులై తృప్తిని బొందుచుండుదురు విద్యాశూన్యులై పాపవా।
ర్ధి దగుల్కొంచును సర్వదేవతల కాధిష్ఠాన మీవంచు నీ।
పదవిం గోరరు నిత్యతృప్తిని చరింపన్ భక్తకల్పద్రుమా॥ ౬౨

మ॥ కలిలో జిక్కినవారు బ్రాహ్మణులు భూకాంతుల్ ధనేశుల్ బు।
ద్ధులునన్ తక్కెకాలంబువారు ప్రతివారు స్త్రీడియల్ వారి ని।
ర్మలభావాంతర భేదముట్టు లధికారప్రేరితంబయ్యు నీ।
కొలువే సేయునిచో సుఖంబుగలదొక్కో భక్తకల్పద్రుమా॥ ౯౩

మ॥ క్రమమొప్పారగ నాల్గువేదముల్ సాకల్యంబు దా సేయునీ।
విమలంబంచుచు దీర్ఘసత్రములు వే బెట్టించనీ గుళ్లగో।
ప్రములెన్నో ఘటియించనీ స్ఫురితతత్త్వజ్ఞానమే లేక మో।
క్షము సిద్ధించునె రక్షితార్తజనవీక్షా భక్తకల్పద్రుమా॥ ౯౪

మ॥ తగువర్ణాశ్రమధర్మకర్మ మనువృందార సేయు నద్దానిచే।
త గడింపంగల లాభమెద్ది యని తద్ధర్మంబునన్ వీడగా।
దగదెవ్వారికి దోసమంటునదు శ్రద్ధాభక్తినీరెంటిపొం।
దుగణింపన్ భవదాజ్ఞ ధర్మమువ నుండున్ భక్తకల్పద్రుమా॥ ౯౫

మ॥ అలవాస్పంటి వనాదినుండి కడుహేయంబైన దేహోభిలా।
పలకే బొల్పతుచుండు మానసము తృపాదూషణంబొల్ల డె।
టులవేగింతును దీనితోడ నికమట్టుంబెట్ట కేలా భళా।
చలముం జూపెద వెద్ది నాకుగతి యీశా భక్తకల్పద్రుమా॥ ౯౬

శా॥ యోగాంగంబుల నిమ్నతం బలుకు కెట్టోప్పున్ మనోవాసనా।
భాగంబెల్ల లయక్షముం దృషతరప్రజ్ఞావిశేషంబు ని।
యోగింపన్ కృశమెద్ది నిత్యవిలసద్యోగీంద్ర సంభావితం।
బా గాఢస్థిత చిత్సమాధి కిరవేదా భక్తకల్పద్రుమా॥ ౯౭

మ॥ ప్రతివారున్ ఘనయోగతంత్రముల సంభావింపలేరొక్కొ యం।
చు తపింపంగ వృథావివేకమగు చే శోధించగా వారివా।
రి తపోమూలమునన్ జనించుగతు లారీతి న్విభాగించి స్వ।
స్థితిలోనుంకుట యొప్పుగాదె గురుమూర్తీ భక్తకల్పద్రుమా॥ ౯౮

మ॥ శివజీవైక్యపదంబునొంది ఘనసచ్చిత్ సౌఖ్యవేలామహా
ర్ణవమధ్యంబున నోలలాడు విదితప్రాజ్ఞుండు నిర్వాత ఫా
రవనంబందుననున్న దారసుతమిత్రవ్రాతముల్ గొల్వ నిం
టవసింపన్ సవమానుగాదె గతసంగా భక్తకల్పద్రుమా॥ ౯౯

మ॥ పురుషుండంగన వేసమూని యమితామోదంబు సంధిల్ల భా
వరసాస్వాదరతి బోటియట్లునటియింపన్ నాతిగాకటు నీ
వురజోవ్యాప్తిని జీవధారివనిసన్ బొల్పొంద జీవుండవే
పరమాత్ముండవుగాని మానిజనజీవా భక్తకల్పద్రుమా॥ ౧౦౦

శా॥ దారాపుత్రుల బెంచలేక భువిలో దారిద్ర్యమున్ బొక్కుచున్
వేరాసంబడి కూళవేసములచే వెంపొంది వేదాంతినం
చూరూరం దిరుగాడువాడు చెడునిట్లూహింప శార్దూల వే
షారూఢిం జరియించు కుక్కగతిలోనై భక్తకల్పద్రుమా॥ ౧౦౧

శా॥ భక్తిన్నీపద నీరజాతములు సేవంజేయు కేతప్ప యే
రక్తింబోని స్వభావుడంచు కనులారన్ జూడకిల్లేలనీ
శక్తింబంపి యనేకచిక్కులను వేసారించి సాధించెదే
యుక్తిం దోచ దికేమిత్రోవ బుధబంధూ భక్తకల్పద్రుమా। ౧౦౨

మ॥ తనుదాగాంచిన వానిలక్షణములన్ స్థాపించుటెట్లొప్పునే
వననో మాననొ నిల్చునో నడచునో వ్యాసంగుడై యుండనో
తిననో యూరటగాంచునో పృథుసమాధిం జెందునో జెందడో
గనలేనన్యులు వారివారికగుగాకన్ భక్తకల్పద్రుమా॥ ౧౦౩

మ॥ అనిశంబున్ భవదీయకీర్తనము లత్యంతామోదంబుచే
తనుసేయంగల భక్తసంతతికి యుక్తంబైన వైరాగ్యసా
ధనసంపత్తి గలట్టివారికి మహత్త్వార్థముం బోధసే
దాన నీవే గురురూప మొందితి గదయ్యా భక్తకల్పద్రుమా॥ ౧౦౪

మ॥ గురుశిష్యద్వయ భేదమెంతదనుకన్ గూఢంబుగా నుండునో
యరుదారన్ గురుడన్న నీతనిన భేదాసక్తమందారకు
స్థిరమై యుండును శిష్యుడెప్డు గురుడై జెల్వొందునో యప్పుడే
గురుడే నీవగుగాక రెండుగలవృక్షోక్తి భక్తకల్పద్రుమా॥ ౧౦౫

మ॥ భయభక్తిన్ గురుచే ప్రభుండు పరదైవంబెల్ల చుట్టాలు త
ల్లియు దండ్రిన్ సఖుడంచు ప్రత్యహము దాలెక్కించి విశ్వాసముం
చియు సేవించిన వా డఖండపదసచ్చిత్ సౌఖ్యమే పార ని
ర్భయుడై తే గురుశిష్య సంధిగను దేవా భక్తకల్పద్రుమా॥ ౧౦౬

మ॥ వెలుచన్ లోహము వహ్నిసంగమున విచ్ఛిన్నత్వమై వహ్నిధ
ర్మలు దానిం గలుగుండు సేయునటులే మాయాపరిభూత ధ
ర్మలు నీయందు బెడంగి మూఢులకు నస్మాదంబు రెట్టించు నే
వల తాదాత్మ్యము చేతగాదె రిపుతాపా భక్తకల్పద్రుమా॥ ౧౦౭

మ॥ భవదంఘ్రిద్వయ నీరజాతములపై భావించి వృత్తంబు లి
య్యవి ఫుల్లప్రసవాళిగాగ శతకంబర్పించి పూజించితిన్
భవసంసార విదారమైన పృథుసద్భక్తిన్ బ్రసాదింపుమా
శివ శంభో జలజాండమండలనివాసీ భక్తకల్పద్రుమా॥ ౧౦౮

శ్రీ సద్గురు పరబ్రహ్మార్పణమస్తు.

— సమాప్తమ్ —

శ్రీ శ్రీ శ్రీ



# శ్రుతిధర్మసంజీవని

## వర్ణాశ్రమధర్మపక్షమున వాదించు

## పక్షపత్రిక.

—♦ వార్షిక చందా. ♦—

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులు | రు 12-0-0 | చందాదారులు | రు 3-0-0 |
| అనుపోషకులు | రు 6-0-0 | విడిసంచిక | రు 0-4-0 |

అర్ధ సంవత్సర చందా. రు 2-0-0

---

జి. యస్. వి. సరస్వతిగారి చరిత్రాత్మకమగు

## జాతివిభాగపర్వము.

(ప్రథమ భాగము.)

ఇందు దివ్యజ్ఞానసామాజికులు బ్రాహ్మసామాజికులు ఆర్యసామాజికులు కులనాశకయత్నములు చేయు బోధలను అందుముఖ్యముగ జి. యస్. వి. సరస్వతిస్వామిగారి చరిత్ర మూలమున తత్ప్రవర్తకులు చెప్పుచున్నట్టియు బ్రాహ్మణద్వేషము వృద్ధిపరచుచున్నట్టియు బోధలందు విఫలముగ విమర్శింపబడినవి.

వెల రు 0—8—0 మాత్రమే.

## వర్ణవ్యవస్థ.

ఇది భారతదేశమునగల నాలుగుజాతులయొక్క పుట్టుకననుసరించి శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాసాది ప్రమాణములతో చక్కగా విమర్శించి వ్రాయబడినది. వెల రు 0-4-0

## బ్రాహ్మణేతర దుస్థితి.

3 భాగములు — భాగము 1కి వెల రు. 0-2-0.